# సాఫల్య జీవులు
# సారూప్యాలు-సామీప్యాలు

(పదిమంది మహానుభావుల పోలికలపై ప్రసంగ వ్యాసాలు)











ప్రచురణ : **నిరంతర** (ఆంధ్రప్రదేశ్-తెలంగాణ)

# సాఫల్యజీవులు....
## సారూప్యాలు-సామీప్యాలు
(పదిమంది మహానుభావుల పోలికపై ప్రసంగ వ్యాసాలు)

రచన, సంకలనం
గౌరవ్

ప్రచురణ
నిరంతర
ఆంధ్రప్రదేశ్-తెలంగాణ

కాలం
డిసెంబరు, 2017

మూల్యం
మీ ఆచరణ
మీ ఆచరణ

ప్రతులకు : 9032094492

వివరాలకు : gouravmeka@gmail.com

## ఇందులో...


| | |
|---|---|
| **1) డైనమేట్‌ల వెలుగులో..** | **4** |
| **2) భగత్‌సింగ్–లోహియా** | **8** |
| **3) బి.ఆర్. అంబేడ్కర్ – రాహుల్ సాంకృత్యాయన్** | **13** |
| **4) అల్లూరి నుండి పింగళి వరకూ..** | **17** |
| **5) గాడిచర్ల – బూర్గుల** | **20** |
| **6) మాలవ్యా – రాజాజి** | **22** |


## అంకితం...

ఎక్కడో పుట్టి ఇక్కడి నేలనీ, మట్టిని, మనుషుల్ని ప్రేమించిన

విశ్వమానవతా స్త్రీ మూర్తులు

**మదర్ థెరిసా**

**అనిబీసెంట్**

**సిస్టర్ నివేదిత**

**మీరాబెన్**

**ఎలెన్‌రాయ్**

**మిర్రా అల్ఫస్సా..**

వంటి సాంస్కృతిక వికాసోద్యమ సారథులందరికీ...

శిరస్సు వంచి నమస్కరిస్తూ....

# 1. డైనమేట్‌ల వెలుగులో...

నా టెన్త్ క్లాసు అటకెక్కగానే స్మారతం చదివి పౌరోహిత్యం చేసిన నేను తర్వాత సంవత్సరం బైబిలు పట్టుకొని చర్చిల వెంబట ఏది నిజమయిన క్రైస్తవమో తెల్సుకోడానికి తిరిగాను. పిమ్మట ఇస్లామిక్ ఇన్ఫర్మేషన్ సెంటర్ (హైద్రాబాద్)లో సభ్యుడినై అల్లామీద అచంచల విశ్వాసంతో అందరికీ సందేశం విన్పిస్తుండేవాడ్ని. అలాగే జైనమత గ్రంథం ఆగమ్(?) చదివి 'నమో అరిహంతానామ్' అంటూ నవకార మహామంత్రాల్ని పఠించిన నాటి నుండి గురుగోబింద్‌సింగ్ స్ఫూర్తితో సిక్కు ధర్మాన్ని అధ్యయనం చేసేంతదాకా ప్రయాణం జరిగింది. ఈలోపు ఏదోక పనిచేస్తే కాని గడవని పరిస్థితి తరమడంతో కొరియర్ బిజినెస్ తర్వాత ఎ టు జెడ్ సర్వీస్ నడిపాను. హైద్రాబాద్‌లో అకౌంటెంట్‌గా చేరాను. తర్వాత చెన్నయ్ రిలయెన్స్ కాల్ సెంటర్లో 'కస్టమర్ సర్వీస్ అసోసియేట్'గా చేసాను. ట్రాన్స్‌పోర్ట్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా, బెంగుళూరులో కొద్దికాలం ఉన్నాను. ఉత్తరాఖండ్‌లోని శ్రీనగర్‌లో స్టోర్‌కీపర్‌గా, రాజస్థాన్ జోధ్‌పూర్ గెస్ట్‌హౌస్‌లో మెయింటెనర్‌గా, ఢిల్లీలో మల్టీనేషనల్ సంస్థలో అడ్మిన్‌గా, అస్సాంలో ఫీల్డ్ సూపర్ వైజర్‌గా.... పిఠాపురంలో శ్రీ ట్యూషన్ సెంటర్ పెట్టి చాలామంది విద్యార్థులు ఉండగానే మూసేసిన నాటి నుండి 'ప్రజాపర్సనాల్టీ డెవలప్ సెంటర్‌ని పెట్టి చేతులు కాల్చుకొనేదాకా పరాజయాలన్నింటిదీ ఒక ప్రత్యేక ప్రయోగాల చరిత్రే. ఈ కాలమంతా ఉద్యోగాలతో పాటు ఉద్యమాలూ నా జీవితంలో భాగమయ్యాయి. వ్యవస్థలోని చెడుపై కరపత్రాలతో మొదలయిన నా యుద్ధాన్ని పుస్తకంగా చూసుకోవాలన్న తొందరలో కొట్టుమిట్టాడుతుంటే రోజంతా కష్టపడితేగాని గడవని శ్రామిక మిత్రులు తలోచెయ్యి వేసి మొట్టమొదటి రచన బయటపడ్డానికి సహకరించారు. అప్పట్నుంచీ ముద్రణ కోసం తడుముకుంటూనే రచనా వ్యాసంగాన్ని మున్ముందుకు నడుపుతున్నాను. సరే, ఇలా చెప్పాలంటే చాలా వుంది కానీ, మరీ ఇబ్బందిగానున్నప్పుడు సాఫ్ట్ కాపీల రూపంలో సామాజిక మాధ్యమాల్లో పుస్తకాల్ని అందుబాటులో వుంచడం జరుగుతుంది. అప్పుడప్పుడు ఈ చదువుకీ, నా రాతలకీ, తిరుగుడుకీ అసలేమైనా ప్రయోజనముందా అని ఆత్మీయులనుండే ప్రశ్న ఎదురౌతుంటుంది. సమాధానం కోసం మనస్సు సంఘర్షణ పడుతుంది.

వందల సంవత్సరాల్నుంచి పేరుకుపోయిన పర్వతసానువుల్ని పేల్చడానికి పేలుడు పదార్థాలెలా అవసరమో, వ్యవస్థలో వేళ్ళూనుకుపోయిన సంకుచిత సంకెళ్ళను కూల్చడానికి కొన్ని డైనమేట్‌లు అలాగే అవసరం. అక్షరమయినా, ఆచరణయినా డైనమేట్‌లు సమాజాన్ని నిర్దేశించే సెర్చిలైట్‌లు. అలాంటి డైనమేట్‌ల్ని తీర్చిదిద్దే వాతావరణాన్ని కల్పించడం కోసం నిబద్ధతగా జీవిస్తున్న కొందరు ఆత్మీయులే లేకపోతే ఇటువంటి ప్రయత్నాలు ఇంత సులభంగా ముందుకు సాగవు. మిత్రులు రావెల సోమయ్య, అరుణ దంపతులు ఎంతో ఆపేక్షతో వాళ్ళెళ్ళలేకపోయిన ప్రతి సమావేశానికీ పంపుతూ నిత్యం నన్ను ప్రోత్సహిస్తుంటారు. నా ప్రతీ రచననూ వాళ్ళే చేసినంత మురిసిపోతూ నలుగురికీ పరిచయం చేస్తుంటారు. మొన్నీమధ్య పర్యావరణ పరిరక్షణ, సహజసిద్ధ జీవన విధానాన్ని

ప్రచారం చేస్తూ, వ్యవసాయంలో రసాయన మందుల వాడకాల్ని నిరసిస్తూ 'సేవ్ తమిళ్‌నాడు' నినాదంతో, ప్రకృతి ప్రేమికుడు, ప్రజా తాత్వికుడూ 'వనగమ్' స్థాపకుడు, **నమ్మళ్వార్** స్ఫూర్తితో మిత్రులు తమిళనాట కొన్ని వందల కిలోమీటర్ల పాదయాత్రకి పిలుపిచ్చారు. తమిళనాడు మాత్రమే కాక దేశం మొత్తాన్ని అట్టుడికించిన **జల్లికట్టు** ఉద్యమాన్ని వెనకుండి నడిపించిన సారధులు భారతి, వినోద్, నిత్యానందలతో కల్సి కాంచీపురం జిల్లా, మధురాంతకం తాలూకా, కంశపాలెం గ్రామంలో ప్రచారం చేస్తూ అక్కడే డిసెంబర్ 6 అంబేద్కర్‌కి నివాళులర్పించి కొద్దిదూరం యాత్రలో పాల్గొన్నాను. మేల్‌మెరువుత్తూర్‌లో యువత ఘనస్వాగతం పలికి భాజాభజంత్రీలతో మిట్టమధ్యాహ్నం, నట్టనడిరోడ్డులోని బస్టాండ్‌లో నన్ను సన్మానించారు. తిరిగి నేనక్కడికక్కడే వారిని సన్మానిస్తూ దేశానికి మీలాంటి డైనమేట్‌ల అవసరం ఉందన్నాను. ఒకసారెవరో రచయిత కర్తవ్యం ఏంటని అడిగితే అలిశెట్టి సంక్షోభ గీతంలోని కవిత 'లెటస్‌గో'ని ఉదహరించాను,

గొంతు విప్పితే
భాస్వరమై మండుతున్న వేళ
గోనె సంచిలో శవసాహిత్యాన్ని మోసుకెళ్తుంటాడొకడు

అక్షరాన్ని అస్త్రంగా సంధిస్తున్న వేళ
అశ్లీలంతో ప్రేమామృతం చిలుకుతుంటాడికొకడు

విప్లవోద్యమంలో విలీనమై
అక్షరం
అలలు అలలుగా ఉప్పొంగుతున్న వేళ
అనుభూతి గోతిలో ముడుచుకొని
జీవిత మహోత్సవాన్ని
"కంటూ" ఉంటాడు మరొకడు

లెటస్ గో మై ఫ్రెండ్స్
మనమైతే అక్షరాన్ని
సెర్చిలైట్, డైనమేట్‌గానే వినియోగిద్దాం.

అంటాడు. రచయితా, సామాజిక కార్యకర్తకి ఉండాల్సిన రెండు ప్రధాన లక్షణాలు సెర్చింగ్ అండ్ డైనమిజమ్.

వివేకానందుడి జయంతి రోజున అందరూ ఆయన భజన చేస్తుంటే, అలిశెట్టి ధిక్కారాన్ని గురించి గుర్తు చేసుకున్న సందర్భంగా ఇలాంటి పోలికలపై ఆసక్తికర చర్చ తలెత్తింది. భగత్‌సింగ్–లోహియాల గురించి నా ప్రసంగ వ్యాసానికి మంచి స్పందన వొచ్చింది. అరుణతారలో ప్రచురించిన దానిని చూసి సోషలిస్టు మిత్రులు సంతోషం పంచుకున్నారు. అంబేద్కర్, రాహుల్ సాంకృత్యాయన్‌ల గురించి అప్పట్లో చర్చ జరిగింది. సైన్స్–హేతువాదం పత్రికలోవచ్చిన దానిని గురించి సీనియర్ సైన్సు ఏక్టివిస్టు ఒకాయన ఆశ్చర్యపోవడం నాకిప్పటికీ జ్ఞాపకం. యువసంవాద్ పేరుతో కాశీ వద్ద జరిగిన ఒక

సమావేశానికి వెళ్ళినప్పుడు శాంతియుత ధర్నాకి కూడా భయపడ్డ పాలకులు సభ జరుగుతున్న స్కూలుని చుట్టిముట్టి హౌస్ అరెస్టు చేసారు. ఆ ప్రయాణంలోనే, నేను రాహుల్ సాంకృత్యాయన్ జన్మస్థలాన్ని వెతుక్కుంటూ వెళ్ళి యు.పి.లో ఆయనకి సంబంధించిన ఆసక్తికర విషయాల్ని తెల్సుకొంటున్న సందర్భంగా వీరిరువురి సంబంధాల గురించి మంచి చర్చ జరిగింది. అజంఘర్ జిల్లాలో ఆయన పిత్రు గ్రామం కనైలీ, మాత్రు గ్రామం పంధ్‌లలో రెండు చోట్లా నిర్మించిన స్మారక భవనాల్ని, గ్రంధాలయాల్ని చూసాను. చక్రపాన్‌పూర్‌లో మధ్యస్తంగా నిర్మించిన రాహుల్ విగ్రహానికి ఇరువైపులా ఈ రెండు గ్రామాలూ ఉన్నాయి. అద్వితీయ పరిశోధకుడిగా పేరొందిన రాహుల్ సాంకృత్యాయన్ పేరుతో స్థాపించబడ్డ రెండు గ్రంథాలయాలు, బుద్ధుడు నిర్యాణం చెందిన కుశీనగర్‌లోని మ్యూజియం ప్రాంగణంలో ఆయన పేరుతో పెట్టిన లైబ్రరీ, పాట్నాలో ఆయన సరంజామా... అన్నీ అత్యంత నిర్లక్ష్యానికి లోనుకాబడ్డాయి. దార్శనికుల చరిత్ర భావితరాలకి దారి చూపుతుంది. వారి కృషిని పరిరక్షించుకోవడం అందుకే ప్రపంచానికి అవసరం. అది లోపించిన సమాజం సాంస్కృతిక సంకుచితత్వంలోకి నెట్టబడుతుంది. గతంలో అల్లూరి సమాధిని సందర్శించినప్పుడు, మహాత్మా జ్యోతిబాఫూలే, సావిత్రిబా ఫూలేల స్వస్థలానికి వెళ్ళినప్పుడు కూడా నాకిలాగే అనిపించింది. ఇక ఎమ్మెన్ రాయ్ సమాధినయితే ఏకంగా మాయం చేసారు. భౌతిక సంపదపై ఆపేక్ష మానవాళి భావౌన్నత్యాన్ని హత్య చేస్తుంది.

నిజానికి మహానుభావుల జ్ఞాపకాలు వర్తమాన వ్యవస్థకి వొచ్చే వ్యాధుల్ని తగ్గించే మందులవంటివి. ఒక జాతి సారస్వత స్థాయికని సగర్వ ప్రతీకలు. కానీ, దురదృష్టవశాత్తూ అమానవీయ సంస్కృతి మోజులో సాంస్కృతిక వారసత్వ సంపదను చేజేతులా నాశనం చేసుకోవడమే నాగరికత అనుకొంటున్నాం. ఆ దృష్టితో వివిధ సందర్భాలలో ఇచ్చిన ప్రసంగాలు, ప్రసంగ వ్యాసాలను యిలా ప్రచురించడం జరుగుతోంది. కాలగర్భం కంటే జాతి నిర్లక్ష్యం బారినపడి మసకబారుతున్న చరిత్ర ఆనవాళ్ళను వీలైయినన్ని ఎక్కువ తరాలకు తెలియజేయడం వివేక వ్యవస్థ బాధ్యత. విగ్రహాలు, సమాధులు, స్మారక చిహ్నాల్లాంటివి మానవీయతను పెంపొందించాలే కాని, మసకబార్చరాదు. అనంతమయిన కాలమహాయానంలో అన్నీ కల్సిపోవలసినవే కాని మానవజాతి ఔన్నత్యానికి సేవలందించిన ప్రేరకుల చిహ్నాల్ని ఎంతమందికి అర్థవంతంగా అందించగలుగుతున్నామన్న దానిపైనే ఏ తరం సాంస్కృతిక వికాసమయినా ఆధారపడి వుంటుంది. ఈ విధంగా మరెందరో సారూప్యతలున్న సాఫల్య జీవులుండవచ్చును. ఫూలే, ఏంగిల్స్ మొదలుకుని సి.పి. బ్రౌన్, తెన్నేటి విశ్వనాథం, సంజీవయ్య – సుభాష్ చంద్రబోస్, టాల్‌స్టాయ్ – మావో.. ఇలా ఎన్నో పోలికలుంటాయి. జిజ్ఞాసపరులు ఎవరయినా ఈ విషయాలపై కృషి సలిపితే సంతోషం. ఈ వ్యాసావళిని రచించే క్రమంలో కొందరి రచనలు, పత్రికలు ఉపయోగపడ్డాయి. వాటి వివరాలు సేకరించని కారణంగా దీంట్లో యివ్వలేదు. అలాగే ఎంతోమంది ప్రత్యక్షంగా, పరోక్షంగా సహకరించారు. పత్రికలు కొన్ని వీట్ని ప్రచురించాయి. వీరందరికీ పేరుపేరునా నా ధన్యవాదాలు. రాహుల్జీ మేనల్లుడు చిన్ని సందర్శకుల పొత్తాన్ని నాకు చూపించాడు. రష్యాలో ఉంటున్న రాహుల్ కొడుకు ఇగోర్ మొదలుకుని మరో కొడుకు జయ దాకా రాహుల్ సతీమణి కమలతో పాటూ దేశంలో ఎందరో ప్రముఖుల

అభిప్రాయాలున్న ఆ చిన్ని గ్రంథంలో నన్ను కూడా రెండు వాక్యాలు వ్రాయమని కోరాడాయిన.

రాహుల్జీ దేశంలోని అన్వేషకులకందరికీ ఆరాధ్యుడు, అప్రకటిత గురుసమానుడు. ముఖ్యంగా తెలుగులో ఎందరో ఆయనకి మిత్రులున్నారు. ఎంతోమంది అభిమానులున్నారు. ఆలూరి భుజంగరావుగారైతే ఆ రోజుల్లోనే ఏకంగా 'రాహుల్ సాహిత్య సదన్' పేరుతో సంస్థని స్థాపించి ఎన్నో విలువయిన మహాగ్రంథాల్ని తెలిగీకరించారు. సంజీవ్‌దేవ్, పుట్టపర్తి నారాయణాచార్యులు మొదలగు ఉద్దండులతో రాహుల్ సాన్నిహిత్యం మనం ఎరిగున్నదే. మిత్రులు వెలమాటి సత్యనారాయణగారు రాహుల్‌జీ ప్రసంగాల్ని రెండుసార్లు స్వయంగా విన్నవారు. సోమసుందర్‌గారికి రాహుల్ రాసిన లేఖలు కూడా ఇంకా బయటకి రావాల్సుంది. ఇవన్నీ మనసులో మెదులుతుండగా నా మొట్టమొదటి ముద్రిత కరపత్రం కూడా రాహుల్జీ మీదనే అనే విషయం ఆయనతో చెప్తూ ఎరిగిన సంతకాలేవయినా ఉన్నాయేమోనని పుస్తకంలో వెతకడం మొదలెట్టాను. తెలుగు మాట సంగతి అటుంచి దక్షిణ భారతదేశం మొత్తంలో ఒక్కరు కూడా ఉన్నట్టు కనబడలేదు. రాహుల్జీకి కనైలీ గ్రామానికి చాలా అనుబంధముంది. ఆయన ఆత్మకథలో ఎన్నోసార్లు ఈ ప్రస్తావన వచ్చింది. '*కనైలీ కీ కథా*' పేరుతో రాహుల్జీ ఒకపుస్తకమే రాసారు. ఆయన జన్మస్థలమైన పంధాకి కనైలీ ఎంతో దూరం కూడా లేదు. అటువంటి ప్రదేశాలు తెలుగు శోధకుల దృష్టిని ఆకర్షించకపోవడం బాధాకరం. రాహుల్జీ అనే కాదు. ఎందరో మహనీయుల చారిత్రక చిహ్నాలు కాపాడుకోవడం నాగరికులుగా మన అందరి విధి. ఈ ఆలోచనలు సుడులు తిరుగుతుండగా కలం తీసి రాయడం మొదలెట్టాను;

> ***"జీవితంలో నన్ను అత్యంత ప్రభావితం చేసిన రాహుల్ సాంకృత్యాయన్ గురించి అన్వేషిస్తూ ఇలా వివిధ వ్యక్తిత్వాలతో విలసిల్లుతూ పర్యటించడం కొత్త ఉత్సాహాన్నిచ్చింది.... జీవితాన్ని అనేక విధాల నిర్వచించుకొని స్వచ్ఛంద సంకుచితత్వంలో కుచించుకుపోతున్న ఈ సమాజానికి రాహుల్ వో ప్రౌడబుల్ డైనమేట్!"***

ఆయనే కాదు ఇందులో సంక్షిప్తంగా పోల్చిన వారంతా వ్యవస్థ దిశదశల్ని నిర్దేశించి చీకటితో యుద్ధంచేసి భావితరాలకి వెలుగునందించిన చారిత్రక డైనమేట్‌లే. వారి వెలుగులో ఆ వెలుగుకి భయపడే చీకట్లకి మరో శరాఘాతంగా ఈ పొత్తాన్నిలా వెలువరిస్తున్నాను, జిందాబాద్!

**డిసెంబర్, 2017** — **– గౌరవ్**

# ౨. భగత్‌సింగ్ - లోహియా సంక్షిప్త పరిచయం

**(మార్చి 23 భగత్‌సింగ్ వర్ధంతి, రామ్ మనోహర్ లోహియా జయంతి సందర్భంగా పిఠాపురం సూర్యరాయా విద్యానంద గ్రంథాలయంలో 'సహృదయ మిత్ర మండలి' వారి ఆహ్వానం మేరకు నా ప్రసంగ పాఠం)**

మిత్రులారా,

నిజానికి ఈ సభాస్థలి నాకెంతో మహత్తరమైనది. వ్యక్తిగత జీవితంలో నాకు స్ఫూర్తినిచ్చి ఈ గ్రంథాలయాన్ని భావితరాల కందించిన ఇద్దరు యోధుల్ని స్మరించుకుంటూ, భారద్దేశ విప్లవోద్యమంలో ప్రధానపాత్ర పోషించిన మరో యిద్దరు చారిత్రక ధీరుల్ని గురించి నా అభిప్రాయాల్ని వెల్లడించే అవకాశం రావడం ముదావహం.

వజ్రాయుధ కవిగా జాతీయ స్థాయిలో పేరొందిన ఆవంత్స సోమసుందర్‌గారి కమ్యూనిస్టు భావాలు, మడమతిప్పని కర్తవ్యశీలిగా పేరొంది దుష్టశక్తులతో తన శక్తికి మించి పోరాడి ఈ జ్ఞానభాండాగారాన్ని కాపాడిన చెలికాని భావనరావుగారి సోషలిస్టు భావాలు కలగలసి అంతో యింతో నన్ను ప్రభావితం చేసాయనేది వాస్తవం.

అదే స్ఫూర్తితో ఈ దేశంలోని అణగారిన ప్రజల కోసం చివరిదాకా విశ్రమించకుండా జీవితాల్ని త్యాగం చేసిన యిద్దరు మహనీయుల్ని మీకు నా దృష్టికోణంలో పరిచయం చేసేందుకు ప్రయత్నిస్తాను. ఆసక్తికరమయిన విషయమేమిటంటే నేను పరిచయం చేయబోతున్న ఇద్దర్లో ఒకాయిన కమ్యూనిస్టు, మరొకతను సోషలిస్టు.

మొదటి వ్యక్తి సర్దార్ భగత్‌సింగ్, రెండో వ్యక్తి రామ్‌మనోహర్ లోహియా. అద్వితీయమయిన వీరిద్దరి జీవితాల గురించీ తెలుసుకున్నకొద్దీ ఉత్సాహం ఎక్కువౌతుంది. భవిష్యత్తు తరాల కోసం వారు పడిన తపనను తల్చుకుని కూడా స్పందించని హృదయముండటం ఆశ్చర్యకరమయిన విషయం. వారి జీవిత సౌమ్యాల్ని చూస్తే తెలిసొచ్చే నిజమది.

ఇద్దరూ దేశభక్తికల సంప్రదాయ కుటుంబాల్లో పుట్టారు. నాటి వాతావరణం యిద్దరిలోనూ విప్లవాగ్నుల్ని రగిల్చింది. ఆరంభంలో యిద్దరూ గాంధీని విపరీతంగా అభిమానించినవారే. అదే సమయంలో అవసరమొచ్చినప్పుడు అంతే గట్టిగా వ్యతిరేకించారు కూడా. యిద్దరి జీవితాల్లో సంచలనాలకి కొదవలేదు.

సంగీతమంటే ఇరువురికీ యిష్టం. వివిధ సందర్భాల్లో భగత్‌సింగ్ ప్రసిద్ధ కవుల పాటలు పాడుతూండేవాడు. కోర్టులో కూడా తరచూ తనకినచ్చిన చరణాల్ని ఉదహరించిన దాఖలాలున్నాయి. ఇక లోహియా బాల్యం నుంచే పిల్లనగ్రోవి వాయించేవాడు. కళా సంస్కృతుల పట్ల ఆయన అధ్యయనం ఒక అసిధారావ్రతం.

ఇక పంజాబ్ భాషా లిపి మొదలయిన విషయాల్లో భగత్‌సింగ్‌కి ఎంత కచ్చితమయిన భావాలున్నాయో భాషా వ్యవహారంలో లోహియాకి అంతకంటే నిఖార్సైన అభిప్రాయాలున్నాయి. ఇద్దరూ పత్రికా రచనొక బలమైన ఆయుధంగా ఉపయోగించుకున్నారు. అంతేకాదు, ఇద్దరూ ఆంగ్ల భాషలో నిష్ణాతులుగా రచనలు చేసారు.

సామాజిక సమస్యల విషయానికొస్తే కులాన్ని ఇద్దరూ మనస్ఫూర్తిగా అసహ్యించుకున్నారు. మతాల్ని పూర్తిగా చీదరించుకున్నారు. అనార్కిజాన్ని ఇద్దరూ లోతుగా అధ్యయనం చేసారు. భగత్‌సింగ్ ప్రిన్స్ క్రోఫ్ట్‌కిన్ రచనల్ని ఇష్టంగా చదివి ప్రభావితమైతే, లోహియా జీవితాంతం రాజకీయ అరాజకవాది (పొలిటికల్ అనార్కిస్ట్) గానే బతికాడు.

చదువు విషయానికొస్తే వివిధ ప్రాంతాల్లో సాగిన భగత్‌సింగ్ విద్య విద్యార్థి దశలోనే అతనిలో సాంఘిక విప్లవ బీజాల్ని నాటింది. ఇక అతిపిన్న వయసులోనే విదేశాల్లో తిరుగుతూ విశేష అనుభవాల్ని గడించిన లోహియా కూడా విద్యార్థి దశనుండే సామాజిక చింతనను విశేషంగా సంపాదించాడనే గ్రహింపవశరం.

సిద్ధాంతాల విషయానికొస్తే మార్క్సిజాన్ని ఇద్దరూ క్షుణ్ణంగా అధ్యయనం చేసారు. యిద్దరి రచనల్లోనూ మార్క్సిస్టు అవగాహన మౌలికంగా కనిపిస్తుంది. ఐతే, భగత్‌సింగ్ సోషలిస్టు ఆదర్శాన్ని కమ్యూనిస్టు విప్లవ వెలుగుతో చూస్తే, లోహియా కేపిటలిజం, కమ్యూనిజం రెంటినీ కాదనీ నూతన తరహా సాంస్కృతిక ప్రజాస్వామ్య విధానంలో సోషలిజాన్ని ప్రతిపాదించాడు.

ఇద్దరూ నిఖార్సయిన నిరసనవాదులు. కోర్టుల్ని, జైళ్ళనీ విపరీతంగా ప్రచారానికి వాడుకున్న యోధులు. భారతదేశంలో బ్రిటీష్‌వారి పాలనను ప్రసంశిస్తూ జెనీవాలో నానారాజ్యసమితి సమావేశంలో ఎంతోమంది ప్రపంచాధినేతలు, ప్రముఖులు పాల్గొన్న అటువంటిచోట ఉపన్యసిస్తున్న బికనీర్ యువరాజుకి వ్యతిరేకంగా విజిలేసి గెంటివేయబడ్డవాడు లోహియా.

ఇక చెవిటి ప్రభుత్వాలకి వినిపించేలా చెప్పడానికి వినూత్న తరహా విధానాన్ని రూపొందించినవాడు భగత్‌సింగ్. అసెంబ్లీలో పొగబాంబులు విసిరి బ్రిటీష్ పాలనకు ఆయువుపట్టువంటి చోట అధికారాన్ని సవాలుచేసి అలా ఎందుకు చేయాల్సి వచ్చిందో కూడా స్పష్టంగా ప్రజానీకానికి ప్రకటించినవాడు భగత్‌సింగ్.

ఇద్దరూ వివిధ సందర్భాల్లో జైళ్ళని ఉద్యమ ప్రచారానికి సాధనాలుగా ఉపయోగించుకున్నారు. జైళ్ళ సంస్కరణకు సంబంధించీ ఇద్దరికీ నిర్దిష్టమయిన భావాలున్నాయి. అందుకుగానూ భగత్‌సిగ్ 115 రోజుల నిరాహారదీక్ష చేయగా లోహియా వోటు, పార, జైలు అంటూ నినాదాన్నిచ్చాడు. స్వాతంత్ర్యం రాకమునుపూ తర్వాత కూడా అనేకసార్లు అరెస్టయ్యాడు.

న్యాయస్థానాలకి ఇరువురూ కించెత్తు గౌరవం కూడా యివ్వలేదు. ఇంకా కచ్చితంగా చెప్పాలంటే, లోహియా కోర్టుల్లో వివిధ కేసులేసి న్యాయవ్యవస్థకి గంగవెర్రులెత్తిస్తే, భగత్‌సింగ్ తన సహోద్యమకారులతో కలిసి సాక్షాత్తూ కోర్టునే భావప్రసార మాధ్యమంగా వాడుకుని బ్రిటీష్‌వారికి చెమటలు పట్టించాడు.

వసుధైక కుటుంబం ఇరువురి భావన. అందుకే భగత్‌సింగ్ కలకత్తా నుంచి వెలువడే మతవాలా పత్రికలో బలవంత్‌సింగ్ పేరుతో వసుధైక కుటుంబ భావనని గూర్చి వ్యాసం రాస్తే, స్వీడన్ రాజధాని స్టాక్‌హోంలో వసుధైక కుటుంబమనే ఆలోచనను పంచుకుని చర్చించేందుకు జరిగిన సభలో ఇండియా ప్రతినిధిగా లోహియా పాల్గొన్నాడు.

చట్టానికి దొరకకుండా తప్పించుకుంటూ నిర్మాణాత్మక కార్యక్రమాలు రూపొందించడంలో కూడా ఇద్దరూ సిద్ధహస్తులే. పంజాబ్, యు.పి, బెంగాల్,తదితర ప్రాంతాల్లో వివిధ మారువేషాల్లో తిరుగుతూ కూడా *'నౌజవాన్ భారత్ సభ'* వంటి సంఘాల్ని స్థాపించీ *హిందుస్తాన్ రిపబ్లికన్ అసోసియేషన్‌*కి సోషలిజాన్ని జోడించినవాడు భగత్‌సింగ్.

అలాగే నేపాల్, గోవా మొదలగు విముక్తి ఉద్యమాల్లో పాల్గొన్న లోహియా కూడా సోషలిస్టు పార్టీ వ్యవస్థాపకుడిగానే కాక నిత్యం దేశ సంచారిగా ఉంటూ మేన్‌కైండ్ వంటి ఉద్యమ పత్రికల్ని స్థాపించీ అనితర సాధ్యంగా నడిపాడు. అదే విధంగా వివిధ పత్రికల్లో అసంఖ్యాక వ్యాసాలు రాసాడు.

ప్రజలకీ, కార్యకర్తలకీ అవశరమయిన ఉద్యమ నినాదాల పట్ల యిద్దరికీ ఆసక్తి ఉంది. ప్రసిద్ధ విప్లవ నిత్యనూతన నినాదమయిన *'ఇంక్విలాబ్ జిందాబాద్'*ని భగత్‌సింగ్ ఇస్తే, *రోటీ-బేటీ, వోట్-జైల్-స్పేడ్,* వంటి నినాదాల్ని లోహియా ఇచ్చారు. ఇద్దరూ లాహోర్ జైల్లోనే శిక్షననుభవించి ఉద్యమకారులుగా రాటులేలారు.

సహచరుల్ని ప్రేమించడంలో ఇద్దరికిద్దరే సాటి. వ్యక్తిగత జీవితాల్లో ఎంత దూకుడుగా వ్యవహరించారో సన్నిహితులతో అంతే సౌమ్యంగా ప్రవర్తించారు. సంపాదన పట్ల ఇద్దరికీ ఏహ్యాభావం ఉండేది. చిల్లిగవ్వ మిగుల్చుకోకుండా ఏ సుఖాన్నీ కాంక్షించకుండా భవిష్యత్తు కోసం ఆశతో ఇద్దరూ మరణించారు.

పెళ్ళి చేద్దామని సంబంధం చూసి సిద్ధం చేసిన తరుణంలో సొంతింటి నుండీ రాత్రికి రాత్రి పారిపోయి వ్యక్తిగత జీవితం కంటే విప్లవ మార్గం ఎందుకు మహత్తరమైనదో భగత్‌సింగ్ ప్రకటిస్తే, జమన్‌లాల్ బజాజ్ వంటి ప్రముఖుడి కూతురితో సైతం సంబంధం కుదుర్చుకోవడం ఇష్టంలేక ఆయనింటి నించి పారిపోయి పెళ్ళికంటే లక్ష్యం గొప్పదని నిరూపించిన వాడు లోహియా.

ఇక స్త్రీల విషయంలో ఇద్దరికిద్దరూ అంతే అభ్యుదయకరంగా ప్రవర్తించారు. సాంఘిక మార్పును కోరుకునే సంస్థల్లో స్త్రీలకి ప్రత్యేక అనుబంధ సంఘముండాలనేదే ఇరువురి కోరిక. అందుకోసం భగత్‌సింగ్ విప్లవపార్టీల్లో కచ్చితంగా మహిళా విభాగం కోసం పట్టుపడితే లోహియా తన 'సప్తక్రాంతి'లో స్త్రీ–పురుష సమానతే ఈ కాలానికి ముఖ్య విప్లవమన్నాడు.

చనిపోయేముందైనా దేవుడ్ని తల్చుకోమన్న విజ్ఞప్తిని తిరస్కరించీ ఆత్మవిశ్వాసంతో ఉరికంబమెక్కిన భగత్‌సింగ్‌ని చివరి క్షణాల్లో తన చుట్టూ మూగిన డాక్టర్లను ఎడాపెడా తిట్టి ఎంతోమంది అభాగ్యులుండగా నా చుట్టూ ఎందుకు చేరారని నిలదీసిన లోహియా ఎంతలా అభిమానించాడంటే భగత్‌సింగ్ వర్ధంతిని తప్ప తన జీవితంలో మార్చి 23 జన్మదినాన్నెన్నడూ జరుపుకోలేదు.

నిజానికి సామ్యాలతోబాటూ ఇద్దరిలోనూ వైరుధ్యాలకూ కొదవలేదు. 23 ఏళ్ళకే చిరునవ్వుతో దేశవిముక్తి కోసం ఉరికంబమెక్కిన భగత్‌సింగ్‌ని 57 సం॥రాల లోహియాతో పోల్చడానికి మామూలుగా అభ్యంతరాలెన్నయినా ఉండొచ్చుగాక. కానీ దేశమంతటా మతోన్మాదశక్తులు పెట్రేగిపోతున్న ప్రస్తుత సమయంలో ఈ ఇరువురి పోలికా కొత్త ఉత్సాహాన్నిస్తుందని నా భావం.

యాదృచ్ఛికంగా జరిగే కాకతాళీయమైన సంఘటనల్ని ఆధారం చేసుకుని నిరాధారమయిన పోలికలు తేవడం నా భావం కాదు గానీ సామాజిక హితం కోసం వెచ్చించబడిన ఈ ఇరువురి జీవితాలు ఈ తరానికి ఏ రూపంలో నయినా స్ఫూర్తినందించకపోతాయా అనే అభిప్రాయమే నా ఈ ప్రసంగానికి ప్రధానమయిన ప్రేరణ.

భగత్‌సింగ్–లోహియాల్ని గురించిన మరింత శోధనని అవసరమని తలచే మిత్రులెవరయినా ముందుకొచ్చి చేయడానికి సిద్ధపడితే, సిద్ధాంత విబేధాల మాటెలాగున్నా

మానవీయ విధానాల రూపకల్పన కొరకు జరిగే ప్రయత్నాల సాధనలో అదో ప్రభావశీలమయిన మలుపు కాగలదని కోరుకుంటున్నాను.

జీవితంలో రాజీపడకుండా అనేక అవాంతరాల్ని ఎదుర్కొని సామ్రాజ్యవాదానికి సమాధి కట్టడానికి కసితీరా కష్టపడి, అందుకోసం ఎంతో నిర్మాణాత్మక కృషి చేసి, అణగారిన ప్రజలపై అన్ని విధాల ఆధిపత్యాల్నీ వ్యతిరేకించీ, దోపిడీరహిత సమసమాజం కోసం స్వప్నించిన ఈ ఇద్దరు మహనీయులు మీకు స్ఫూర్తి కాగలరని ఆశిస్తూ,

కొత్తరకపు బానిసత్వాన్ని భక్తిపేరుతో, ఆటల పేరుతో, విలాసాల పేరుతో యువతపై రుద్దుతున్న వినాశకర సంస్కృతి బండారాన్ని బయటకీడ్చి, సమాజంలో నిత్యం రగులుతున్న సమస్యలపై ముందుకొచ్చి స్పందించి, ప్రశ్నించేందుకు మీ వంతుగా ప్రయత్నించడానికి నా యీ రెండు మాటలు లేశమంతయినా ఉపయోగపడితే ఆనందిస్తానని ఆకాంక్షిస్తూ, ఇంతటితో ముగిస్తున్నాను.

**ఇంక్విలాబ్ జిందాబాద్.**

# 3. బి.ఆర్. అంబేడ్కర్ - రాహుల్ సాంకృత్యాయన్ ఇరు వ్యక్తిత్వాల దార్శనికత

**(ఏప్రిల్ 14న డా॥ బి.ఆర్. అంబేడ్కర్ జయంతి, మహాపండిత్ రాహుల్ సాంకృత్యాయన్ వర్ధంతి సందర్భంగా కోరుకొండ, 'సహవాసి స్వాభిమాన్ వేదిక' వారి సభకి నా ప్రసంగ పాఠం)**

మిత్రులారా,

ఈ రోజు దేశం ప్రమాదకర పరిస్థితుల్ని ఎదుర్కుంటోంది. కులం, మతం, వర్గం, ప్రాంతం, పార్టీ, లింగ వివక్ష పెట్రేగిపోతుంది. ఆధునిక భావజాల ప్రభావంతో ఆవిర్భవించిన రాజ్యాంగాన్ని కాదని ఫాసిజం బుసలు కొడుతోంది. మహారాష్ట్ర స్థానిక ఎన్నికల్లో శివసేన ఆధిక్యత కనపర్చడం, యు.పి. ఎన్నికలు బిజెపికి పట్టం కట్టడం ప్రజాస్వామ్యం ప్రమాదంలో ఉందనడానికి స్పష్టమయిన సంకేతాలు.

యాదృచ్ఛికంగా లాల్-నీల్ ఐక్యత అంటే, కమ్యూనిస్టు సోషలిస్టు ప్రగతిశీల శక్తులు - దళిత బహుజన మైనారిటీల మధ్య ఏకత కోసం చర్చ జరుగుతోంది. ఈ సందర్భంలో ఇరు భావజాలాల్ని తమ వ్యక్తిత్వంతో అనితర సాధ్యంగా ప్రభావితం చేసిన యిద్దరు యోధుల్ని గురించి తలుచుకొని, వారి కృషిని ప్రస్తావించుకోవడం ఉద్యమాలకి ఉపయోగకరమనే ధోరణే నా యీ ప్రసంగానికి ప్రేరణ.

మొదటి వ్యక్తి బి.ఆర్. అంబేడ్కర్, రెండోవ్యక్తి రాహుల్ సాంకృత్యాయన్. ఈ దేశంలోని అట్టడుగు వర్గాల ప్రజల కోసం జీవితాంతం రాజీ లేకుండా పోరాడిన ఈ ఇరువురి జీవితాల నుండి ఈనాటి ఉద్యమకారులు నేర్చుకోవాల్సిన విషయాలు చాలా ఉన్నాయనేది నా అభిప్రాయం. అంబేడ్కర్ ఒక తరహా సోషలిస్టయితే, రాహుల్ మరో తరహా కమ్యూనిస్టు.

అంబేడ్కర్ జీవితం చిన్నప్పట్నుంచీ వివక్షమయం. ఆ కసే ఆయన్ని విజ్ఞానగనిగా చేసింది. రాహుల్‌జీ బాల్యం విభిన్న అనుభవాలకి ఆలవాలం. ఆ క్రమమే ఆయన్ని మహోన్నత మేధోజీవిగా మల్చింది. తన జాతిని విద్యకూ, అవకాశాలకూ దూరం చేసినందుగ్గానూ ప్రపంచంలోనే అత్యుత్తమ విద్యావంతుడిగా కష్టపడి చదివినవాడు అంబేడ్కర్.

సమాజంలోని అసమానతల గురించిన బండారాల్ని అహోరాత్రులు అన్వేషిస్తూ వైష్ణవ సన్యాసిగా మొదలుకుని దేశదిమ్మరిగా అనేక అవతారాలెత్తుతూ, లెక్కలేనన్ని వొత్తిడుల్ని ఎదుర్కొంటూ బీదరికాన్ని అంతమొందించడం కోసం స్వీయ అధ్యయనంతో సాటిలేని సత్యాన్వేషిగా మారిన అరుదయిన బుద్ధిజీవి రాహుల్‌జీ.

ఈ దేశపు కుల సమస్యని ఇద్దరూ చాలా లోతుగా అధ్యయనం చేసారు. కులానికి సంబంధించీ యిద్దరూ దాదాపు ఒకే రకమయిన అవగాహన కలిగి ఉన్నారు. కులాన్ని నిర్మూలించాలంటే సమాజంలో అత్యధిక శాతం జనాల మెదళ్ళని నిర్దేశిస్తున్న శాస్త్రాల అధికారాన్ని అంతమొందించాలనేది అంబేడ్కర్ భావం. రాహుల్‌జీ కూడా దాదాపు అదే అభిప్రాయంతో ఉన్నారు.

అందుకోసం ఇద్దరూ ప్రపంచ సాహిత్యం మొదలుకుని పురాణేతిహాసాల దాకా పడిపడీ చదివారు. ప్రాచీన వ్యవస్తని తమదైన రీతిలో పరిశోధించారు. ఆర్యద్రావిడులకి సంబంధించిన సైద్ధాంతిక చర్చను యిరువురూ ఆసక్తికరంగా చేసారు. అంబేడ్కర్ కులనిర్మూలనను ప్రతిపాదిస్తే, రాహుల్‌జీ ఈ సమాజ దుష్టత్వం అంతం కాక తప్పదని ఆకాంక్షించారు.

ఇద్దరిదీ సునిశితమయిన హేతువాద దృక్పథం. అందుకే మతాన్ని భౌతికవాద దృష్టితో పరిశీలించిన గుణం ఇద్దరి రచనల్లోనూ కనిపిస్తుంది. ప్రాచీన భౌతికవాద దార్శనిక రీతులు మొదలుకుని ఆధునిక తాత్విక వేదికల వరకూ అన్నింటినీ ఔపోశన పట్టి భవిష్యత్తును అంచనా వేయగల అరుదైన ప్రజ్ఞ యిద్దరికీ ఉంది.

బహుశా అందుకే ఇద్దరూ బౌద్ధులయ్యారు. బౌద్ధ సారస్వతాన్ని యిద్దరూ ఎంతలా అధ్యయనం చేసారంటే ఆధునిక భారతావనిలో బౌద్ధాన్ని ఆచరణాత్మకంగా పునరుజ్జీవింపజేసిన ఇరుసులుగా ఈ ఇద్దర్నీ పేర్కొనడం తప్పుకాదనుకుంటాను. బౌద్ధాన్ని ఒక ఆధ్యాత్మిక మతంగా కాక విముక్తి పథంగా భావించారు. కనుకనే మానవీయ దృక్పథంగా బౌద్ధాన్ని యిరువురూ ప్రతిపాదించారు.

మార్క్సిజాన్ని ఇద్దరూ లోతుగా అధ్యయనం చేసి అర్ధం చేసుకున్నారు. రాహుల్‌జీ చివరిదాకా కమ్యూనిస్టు దృక్కోణంతోనే రచనలు చేస్తే, అంబేడ్కర్ మార్క్సును, బుద్ధుడ్ని సోదాహరణంగా పోలుస్తూ గ్రంథమే రచించారు. సామ్యవాద భూమికతోనే యిద్దరూ సమాజాన్ని మార్చడానికి అవిశ్రాంతంగా కృషి చేసారు.

ఇద్దరికీ వివిధ స్వదేశీ – విదేశీ భాషల్లో పరిజ్ఞానముంది. సంస్కృతం నేర్చుకోవాలనే అంబేడ్కర్ కోరిక వివక్ష కారణంగా నెరవేరక ఆంగ్ల గ్రంధాలపై ఆధారపడాల్సి వచ్చిందిగానీ ఆ లోటును పరోక్షంగా పూరించి సంస్కృతపాళీ భాషలు మొదలుకుని అనేక భాషల్ని అవలీలగా అభ్యసిస్తూ మతగ్రంథాల బండారాల్ని బయటపెట్టినవాడిగా రాహుల్‌జీని చెప్పుకోవచ్చు.

ఇద్దరికీ విజ్ఞానాన్వేషణంటే విసుగులేని పిచ్చి. అంబేడ్కర్ ఎక్కడికెళ్ళినా పెట్టెల్నిండా పుస్తకాలు ఇంటికి మోసుకొస్తూ ఉండేవాడు. కొలంబియా యూనివర్శిటీ, లండన్ స్కూల్

ఆఫ్ ఎకనమిక్స్‌ల్లో చదివేటప్పట్నుంచీ వొచ్చినప్పుడల్లా వందలాది పుస్తకాల్ని మోసుకొచ్చి గ్రంథాలయంలో ఉంచుకుని చదవడం అంబేడ్కర్ అలవాటు.

ఇక రాహుల్‌జీ సంగతి సరేసరి. ఉన్న గ్రంథాలు, విదేశీ సాహిత్యం కాకుండా అపూర్వమయిన బౌద్ధ సాహిత్యాన్ని అధ్యయనం చేసి టిబెట్, శ్రీలంక, నేపాల్ నుండీ గాడిదల మీద పుస్తకాల సంచుల్ని వేసి సరిహద్దులు దాటించి వాట్ని తీసుకొచ్చినవాడు. ఒకరికొకరు తీసిపోని సత్యాన్వేషకులే ఇద్దరూ.

ఇద్దరూ విపరీతమయిన అధ్యయనాపరులు, ఆలోచనాపరులు, ఉద్యమకారులు, రచయితలు. విదేశాల్లో ఉన్నత విద్యనార్జించి ఇక్కడి విద్యార్థులకు బోధించడానికి అంబేడ్కర్ సిద్ధపడితే, ఈ దేశంలో సంచారిగా తిరుగుతూ అనన్యసామాన్యమయిన జ్ఞానాన్ని సముపార్జించి లెనిన్‌గ్రాడ్ విశ్వవిద్యాలయంలో బోధించడానికి వెళ్ళినవాడు రాహుల్‌జీ.

చదవడం, తిరగడంలోనే కాదు, రాతలోనూ యిద్దరూ యిద్దరే. ఇద్దరూ అగణితమయిన సాహిత్యకృషి చేసారు. అద్భుతమయిన అద్వితీయమయిన రచనలెన్నింటినో సమాజానికి అందించారు. ముఖ్యంగా శాస్త్రీయ ఆలోచనా సరళితో ప్రాచీన సమాజం, బౌద్ధం గురించిన వీరి రచనలు మహత్తరమైనవి, ఎప్పటికీ నిల్చి ఉండేవి.

ఉద్యమ సారథులుగా కూడా ఇద్దరిదీ అందెవేసిన చెయ్యి. శ్రామిక, కార్మిక కర్షకులకి సంబంధించీ అంబేడ్కర్ ముందుండి కృషి చేస్తే, రైతుకూలీ ఉద్యమాలకి సారథ్యం వహించి కారాగారానికి వెళ్ళినవాడు రాహుల్‌జీ. పడ్డ కష్టానికి సరిపడ ఫలం కార్మికులు పొందడం లేదనే బాధ ఇద్దరిలోనూ స్పష్టంగా గోచరిస్తుంది.

వ్యక్తిపూజను ఇద్దరూ నిరసించారు. ఆర్థిక స్థిరత్వాన్ని యిద్దరూ పట్టించుకోనట్లే తోస్తుంది. ఇరువురూ కూడా కాస్త మధ్య వయసులో ద్వితీయ వివాహం చేసుకున్నవారే. కుటుంబ కర్తవ్యాలకంటే సామాజిక హితాన్నే మొట్టమొదట బాధ్యతగా నెత్తినెత్తుకుని ఎన్నో ఒడిదుడుకులు ఎదుర్కొంటూ కూడా చివరికంటూ నడిచినవారే.

అంబేడ్కర్ బౌద్ధం స్వీకరించినప్పుడు దేశంలోని కమ్యూనిస్టులంతా వ్యతిరేకించారు. అప్పుడాయన్ని కల్సి తన మద్దతు ప్రకటించడమే కాక "నవదీక్షిత బౌద్ధులు" అనే వ్యాసాన్ని రచించినవాడు రాహుల్ సాంకృత్యాయన్. ఆధునిక భారతావనిలో నవబౌద్ధానికి ఈ ఇరువురూ రథ చక్రాలనడం అతిశయోక్తి కాబోదనే నా భావం.

ప్రగతిశీల లౌకికోద్యమాల్ని చీల్చే కుట్ర గతంలోకంటే నేడు ఎక్కువగా జరుగుతోంది. సంఘాలు, పార్టీలు, సిద్ధాంతాల ముసుగులో ఈ దేశపు అట్టడుగు వర్గాల ప్రజల్ని మోసం చేయడం జరుగుతూనే ఉంది. దోపిడీకి గురౌతున్న వారి చేత్తో వారి

కంట్లోనే పొడిపించడం భారద్దేశ దోపిడీ వర్గాల ప్రత్యేక లక్షణం. ఇక్కడి సామ్రాజ్యవాదం పేరు బ్రాహ్మణిజం.

అణగారిన ప్రజలకోసం పనిచేయడానికి ముందుకొచ్చిన మిత్రులంతా సహోద్యమకారులుగా ఏకమవ్వాల్సిన సమయమొచ్చిందని గుర్తించడం అవశరం. దేశవ్యాప్తంగా దళిత, బహుజన, ఆదివాసీ, ముస్లిం, మహిళలపై జరుగుతోన్న అమానవీయమయిన దాడుల్ని భౌతికంగానే కాక బౌద్ధికంగా కూడా ఎదుర్కోడానికి అంబేడ్కర్ – రాహుల్‌జీల అధ్యయనం తప్పనిసరి.

కొద్దిపాటి వైరుధ్యాలు, సైద్ధాంతిక విబేధాలు ఎన్నున్నప్పటికీ చారిత్రకంగా ఎంతో గొప్ప పాత్ర పోషించిన ఇద్దరు యోధుల్ని ఈ తరానికి పరిచయం చేయాలనే తపనే తప్ప ఎవరినీ కించపరచాలనో, ఎవరి కృషీ తక్కువ చేసి చూపాలనో నా అభిప్రాయం కాదు. లాల్–నీల్ ఐక్యతపై ఆరోగ్యకరమైన సంవాదానికి ఈ ప్రసంగం పనికిరావాలని ఆశిస్తూ ఇంతటితో ముగిస్తున్నాను.

**లాల్–నీల్ ఐక్యత వర్ధిల్లాలి.**

---

# 4. అల్లూరి నుంచి పింగళి వరకూ... అవిశ్రాంత పోరాట చరితం

**(జూలై 4న అల్లూరి సీతారామరాజు జయంతి, పింగళి వెంకయ్య వర్ధంతిని పురస్కరించుకుని 'సమాజ మిత్రుల సంఘం' ఆధ్వర్యంలో వేమగిరి మైత్రేయ బుద్ధ విహారలో జరిగిన చర్చలో సాగిన నా ప్రసంగం)**

మిత్రులారా,

భారతీయ స్వాతంత్రోద్యమ ఫలితాల్ని కేవలం కొద్దిమంది వృద్ధులకు కట్టబెట్టే కుట్ర చరిత్రలో జరగకపోలేదు. అందువలనే ఈ రోజు యువత నాటి యోధుల ఆదర్శాల మాట అటుంచి కనీసం విగ్రహాల్ని కూడా పట్టించుకోవడం లేదు. వ్యక్తిగత గుర్తింపుని ఏమాత్రం ఆశించకుండా జీవితాంతం జనం కోసమే తపించిన ఇద్దరు పోరాట శూరుల్ని మీకు గుర్తుచేయదల్చాను.

మొదటి వ్యక్తి అల్లూరి సీతారామరాజు.

బ్రిటీష్‌వారి గుండెల్లో రైళ్ళు పరిగెత్తించిన అల్లూరి జయంతి నేడు.

ఇక రెండో వ్యక్తి పింగళి వెంకయ్య

ప్రపంచానికి మన దేశపు హుందాతనాన్ని చాటిన పింగళి వర్ధంతి కూడా ఈరోజే.

నిజానికి వీళ్ళిద్దరి దృక్పథాలూ వేరనే భావన సంగతలా ఉంచితే, దేశం కోసం నిస్వార్ధంగా వాళ్ళు చేసిన త్యాగాల్ని, దేశభక్తి పేరుతో తోటి మనుషుల్నే శత్రువులుగా చూస్తున్న నేటి సమాజం తెల్సుకోవడమవశరం.

మరొకరి కోసం వెచ్చించబడిన మహనీయుల జీవితాలన్నీ కొద్దోగొప్పో సామ్యంగా ఉండకపోవు. ఆయుధాల్ని చేతబట్టి దోపిడీని ఎదిరించిన ధీరత్వం ఒకవైపూ, ఆశయాల్ని సంధించీ ప్రపంచ దేశాల మధ్య భారతదేశానికి మువ్వన్నెల గుర్తింపు తెచ్చిన స్థిరత్వం మరోవైపూ వెరసి మనకి ఒక అపూర్వమయిన అద్వితీయ చరితను అందించాయి. అందులో కొంత ఇప్పుడు మనం ఆస్వాదించబోతున్నాం.

ఇద్దరిదీ దేశభక్తియుత సదాచార సంప్రదాయ కుటుంబాలు. చిన్నప్పట్నుంచే దేశం గురించి అభిమానం ఇద్దరికీ విపరీతంగా ఉండేది. ఇద్దరూ ఒక రకమయిన స్థితప్రజ్ఞులు. దేనికీ వెనకడుగు వేసేవారు కాదు. బాల్యంలోనే తల్లితండ్రులు, సమాజం చేత ప్రభావితం కాబడి జీవితాన్ని దేశ సౌభాగ్యానికి అంకితం చేసినవారే ఇరువురూ.

ఇద్దరూ వైజ్ఞానిక యాత్రికులే. దేశ పరిస్థితుల్ని అధ్యయనం చేయడం ద్వారా స్వాతంత్ర్యం సాధించొచ్చనే నమ్మకంతో పంజాబ్‌లోని పృధ్వీసింగ్ సహా భగత్‌సింగ్ సహచరులు, ఎంతోమంది విప్లవకారుల్ని కూడా కలిసి తన పోరాట పంధాకు కచ్చితమైన స్ఫూర్తిని ఏర్పర్చుకున్నవాడు అల్లూరి. బొంబాయిలో సైనికుడిగా తర్ఫీదుపొంది ఆఫ్రికా, అరేబియా, ఆఫ్ఘనిస్తాన్ మొదలగు వివిధ దేశాలు పర్యటించిన పింగళికి కూడా ప్రయాణాలంటే మక్కువ ఎక్కువే.

ఇరువురూ సైనికులే. గిరిజనులపై దోపిడీ, అణిచివేతల్ని భరించలేక సాంప్రదాయ పోరాట పద్ధతులతో ఆరంభించీ 300 మంది విప్లవదళంతో దాదాపు జీవితాంతం రాజీలేని సైనికుడిగా జీవించినవాడు అల్లూరి. పింగళి బ్రిటీష్‌వారికి వ్యతిరేకంగా సాయుధ పోరాటం చేయలేదు కానీ బోయరు యుద్ధంలో పాల్గొన్నాడు. యుద్ధరంగానికి సంబంధించి ఇద్దరికీ అలా అనుభవముంది.

ఇక అల్లూరి బోధకుడిగా మారి గిరిజనుల్ని చైతన్యవంతం చేస్తే, పింగళి బందరులోని జాతీయ కళాశాలలో అధ్యాపకుడిగా చేసారు. వివిధ వనమూలికలకి సంబంధించీ అల్లూరి పరిశోధించీ ఆయుర్వేదాన్ని కూడా అధ్యయనం చేసాడు. ఇక పింగలి మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో భూగర్భశాస్త్ర పరిశోధనలు చేసి డిప్లొమా పొందడమే కాక 20 సం॥రాలు పాటు నెల్లూరులో ఉండి మైకా గురించి శోధించారు. బొగ్గు వజ్రంగా మారే పద్ధతిని గురించీ 'తల్లిరాయి' అనే పుస్తకం కూడా రాసారు. అంతేకాదు పత్తిమీద కూడా పరిశోధించారు.

దురలవాట్లనూ, దురభ్యాసాలనూ వెట్టి చాకిరీని, అంటరానితనాన్ని, దేశ సమైక్యతకు భంగం కల్గించే వేర్పాటువాదాన్ని యిద్దరూ వ్యతిరేకించారు. అందుకోసం అల్లూరి అజ్ఞాతంలో ఉండి మన్యం వీరుడిగా రూపొంది అమాయక పేద గిరిజనుల కోసం పాటుపడితే, కాంగ్రెస్‌లో చేరి 'డైమాండ్ వెంకయ్య'గా 'పత్తి వెంకయ్య'గా పిలవబడే పింగళి తన పరిధిలో కృషి చేసారు.

వివిధ గిరిజన భాషాలూ, వారి సంస్కృతీ సంప్రదాయాల పట్ల అల్లూరికి పట్టుండేది. మన్యం వీరుడిగా అవతరించడానికి ముందే గిరిజనులకి సంబంధించిన అన్ని అంశాల్ని ఆయన అధ్యయనం చేసాడు. పింగళివారికి భాషల్ని నేర్చుకోవడం చాలా ఇష్టం. ఉర్దూ, అరబిక్, హిందీ, ఆంగ్లాలే కాక ఆయనకు జపనీస్ భాషపై అదుపున్న విషయం కొందరికే తెల్సు. అందుకే ఆయన్ని 'జపాన్ వెంకయ్య' అని కూడా పిలిచేవారు.

ఇకపోతే విశాఖజిల్లా భీమునిపట్నం నియోజకవర్గం పాండ్రంగిలో జన్మించిన అల్లూరికీ, కృష్ణాజిల్లా మొవ్వ మండలం భట్ల పెనుమర్రులో పుట్టిన పింగళికీ గోదావరి

జిల్లాల్తో గాఢమయిన అనుబంధముంది. అల్లూరి తన పోరాట ప్రస్థానాన్ని ప్రారంభించింది విశాఖజిల్లాలోనైనా దాన్ని విస్తరించీ చిన్నస్థాయి సైన్యంగా చేసి బ్రిటీష్‌వార్ని హడలెత్తించింది తూ.గో. జిల్లాలో కూడా. నిజానికి ఆయన పోరాటం దేశవ్యాప్తంగా సంచలనం సృష్టించినప్పటికీ ఆయన ప్రధానంగా సంఘర్షణ సల్పింది మాత్రం రెండు జిల్లాల్లోనే. ఇక పింగళివారు దేశానికి ఒక పతాకమవశరమని తల్చింది కాకినాడలో జరిగిన కాంగ్రెస్ మహాసభలోనే. తర్వాతాయిన బెజవాడ కాంగ్రెస్‌లో దానికి మెరుగులు దిద్దడం జరిగింది. అలా పింగళివారి జీవితంలో కూడా గోదావరికి స్థానముంది.

వ్యక్తిగత జీవితాల్లో వీరిద్దరూ పక్కా లౌకికవాదులే. సొంత నమ్మకాల ప్రభావంతో అల్లూరి దేవీ దీక్ష, యోగాసనాలు, సూర్యనమస్కారాలు మొదలైనవి చేసినా ఉద్యమ జీవితంలో కులమతాలకతీతంగానే మసిలాడు. అలాగే సొంతాస్తిపాస్తులపట్ల ఇద్దరూ ఏహ్యాభావాన్నే ప్రదర్శించారు. వ్యక్తిగత సంపాదనకి ఏనాడు ప్రాధాన్యత నివ్వని ఈ ఇద్దరూ విశ్వనరులుగానే మరణించారు.

నిత్యం పొంచి ఉండే ప్రమాదాల సుడిగుండాల్నుంచి ఎప్పటికప్పుడు తప్పించుకుంటూ, ప్రపంచంలోనే శక్తివంతమయిన బ్రిటీష్ సామ్రాజ్యానికి ఎదురునిల్చి విల్లు ఎక్కుపెట్టిన ధీరత్వం, జాతీయ పార్టీలో ఉండి కూడా ఎన్నడూ ఏదీ ఆశించకుండా ప్రపంచంలోనే అతిపెద్ద ప్రజాస్వామ్య దేశపు హుందాతనాన్ని త్రివర్ణంగా రూపొందించీ ఈ దేశపు సత్తాచాటిన శూరత్వమూ రెండూ బాధాకరంగానే జీవితాన్ని చాలించాయి.

తెల్లవారి కుట్రవల్ల మరణించిన అల్లూర్నీ, స్వాతంత్ర్యానంతరం పూరి గుడిసెలో కటిక దరిద్రంలో తనువు చాలించిన పింగళినీ ఇద్దర్నీ ఈ తరం విస్మరించింది. ఇరువురి కృషి పట్లా జాతిపిత గాంధీకి తీవ్ర అభిమానం ఉంది. అల్లూర్ని గూర్చి అతని వీరత్వం గురించి విని గాంధీజీ చలించి యంగ్ ఇండియాలో రాస్తే, బ్రిటీష్ సైనికుడిగా ఆఫ్రికా వెళ్ళినప్పుడే వెంకయ్యగారితో గాంధీకి పరిచయం. త్రివర్ణ పతాక రూపకల్పనకి సూచనలిచ్చింది ఆయనే. పింగళి గురించి కూడా గాంధీ యంగ్ ఇండియాలో ప్రసంశిస్తూ రాసారు. ఏదైమైనా ప్రమాదకరమయిన నిర్లిప్తత రాజ్యమేలుతున్న ఈ రోజు ఈ తెలుగుజాతి సూర్యులిద్దర్నీ గుర్తుచేసుకోవడం సంతోషం, సెలవు.

---

# 5. సమాజాన్ని గాడిలో పెట్టేవి సంస్కరణలే గాడిచర్ల - బూర్గుల

**(సెప్టెంబరు 14 గాడిచర్ల హరిసర్వోత్తమరావు జయంతి, బూర్గుల రామకృష్ణారావు వర్ధంతి సందర్భంగా ప్రసంగ వ్యాసం)**

మిత్రులారా,

సమాజాన్ని ముందుకు నడిపించేదే సంస్కరణ. సంస్కరణ పురోగమన చిహ్నం. మనిషి అభ్యున్నతికి దారితీసిన మార్గాలన్నీ అతడి సంస్కరణాభిలాషకు ప్రతిబింబాలే. వ్యక్తి ఆలోచనలు ప్రవర్తనలో కనిపిస్తాయి. దానిని సంస్కారం అంటాం. అలాగే సమాజపు ఆలోచనలు దాని సంస్కృతిలో వెల్లడౌతాయి. బూజుపట్టి స్తంభించిపోయిన ప్రమాదకరమైన ఆలోచనలు వ్యవస్థకి హాని చేస్తాయి. వాటిబారి నుండి సంఘాన్ని కాపాడటానికి హేతుబద్ధమయిన చైతన్య కార్యక్రమాలు అవశరం. అవే సంస్కరణోద్యమాలు.

అలా సంస్కరణల ద్వారా సమాజాన్ని ముఖ్యంగా తెలుగు నేలని ప్రభావితం చేసిన ఇరువురు మాన్యుల్ని ఈ రోజు తల్చుకోవడం సంతోషకరం. అందులో ఒకరు గాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు, రెండో వ్యక్తి బూర్గుల రామకృష్ణారావుగారు. కడపజిల్లా సింహాద్రిపురంలో మూలాలుగల గాడిచర్ల 1893లో కర్నూలులో జన్మిస్తే, బూర్గుల 1889లో మహబూబ్‌నగర్ జిల్లా బూర్గుల్లో జన్మించాడు. ఆశ్చర్యకరమయిన విషయమేమిటంటే వీరిరువురి పూర్వికులు మహారాష్ట్ర నుంచి వలస వచ్చినవారే. ఒక విధంగా ఇద్దరి మూలాలు మహారాష్ట్రకి సంబంధించినవే.

బాల్యం నుండీ ఇద్దరికి దేశాభిమానం ఎక్కువే. పూనాలో డిగ్రీ చదివిన బూర్గుల బొంబాయి విశ్వ విద్యాలయం నుంచి లా పట్టా పొందితే, మద్రాసు యూనివర్శిటీ నుండి ఎం.ఏ. పట్టా పొందిన రెండో వ్యక్తి గాడిచర్ల, విద్య, వివేచనయుత భాషా సాహిత్యాల పట్ల మక్కువ ఇరువురికి ఎక్కువే. 1908లో స్వరాజ్య తెలుగు పత్రికను స్థాపించిన గాడిచర్ల *'విపరీత బుద్ధి'* అనే సంపాదకీయం మొదలుకుని రచనా వ్యాసంగానికి ఎంతో ప్రాముఖ్యతనిచ్చారు. ఆష్ అనే బ్రిటీష్ అధికారి విప్లవకారుల్ని కాల్చి చంపినప్పుడు రాసిన ఆ సంపాదకీయానికి 3 సం॥రాల జైలుశిక్షను అనుభవించారు. ఎడిటర్ అనే అర్థంలో *సంపాదకుడు* అనే పదాన్ని మొట్టమొదట వాడింది వీరే. సౌందర్యవల్లి, ఆంధ్ర గ్రంథాలయం, ఆంధ్రవార్త, గ్రంథాలయ స్వరాజ్యం మొదలయిన పత్రికలకు సంపాదకులుగా వ్యవహరించి సాహిత్యాభివృద్ధికి కృషి చేసారు. 1906లో కొమర్రాజు లక్ష్మణరావుతో కల్సి *విజ్ఞాన చంద్రిక* ప్రచురణలు గాడిచర్ల స్థాపించి మొదటి గ్రంథంగా *"అబ్రహాం లింకన్"*ను ప్రచురించారు. ఇది తన జీవితంపై ఎనలేని ప్రభావం చూపిందని

ఆచార్య రంగా ప్రకటించారు. రెండో పుస్తకంగా "ఢిల్లీ దర్బారు"ను ముద్రించారు. కవిత్వంలో కూడా ఆయనకి ప్రవేశముంది. గాంధీజీ, టాల్‌స్టాయ్, ఠాగోరు రచనల్ని గాడిచర్ల అనువదించారు. శ్రీరామచరిత్ర, పౌరశిక్షణ వంటి రచనలు నాడే పాఠ్యాంశాలుగా పెట్టబడినాయి. 1922 కాంగ్రెస్ మహాసభల్లో గాంధీని ఎదిరించి ఆయన చేతనే "బ్రేవ్ హరి సర్వోత్తమరావు" అనిపించుకున్నారు. గాంధి యంగ్ ఇండియా పత్రికలో కూడా ఈ అంశం ప్రస్తావించారు. ఇక బూర్గుల వారు సంస్కృతాంధ్ర భాషలతో సమానంగా ఉర్దూ, పారశీ, కన్నడ, మరాఠి భాషల్లో కూడా పండితులు. ఉమర్‌ఖయ్యాం మొదలగు గ్రంథాలు తెనిగీకరించారు. అలాగే జగన్నాథ పండితరాయల లహరీ పంచకాన్ని, శంకరాచార్య సౌందర్యలహరిని తెలుగు చేయడమే కాక పారశీక వాఙ్మయ చరిత్ర రచించారు.

ఇక రాజకీయాల విషయానికొస్తే గాడిచర్ల వారు హోమ్‌రూల్ లీగు ఆంధ్రశాఖకి కార్యదర్శిగా పనిజేసారు...1927లో కాంగ్రెసు అభ్యర్థిగా నంద్యాల నియోజకవర్గం నుండి మద్రాస్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు ఎన్నికయ్యారు. 1934 నుండీ ఆజన్మాంతం రాష్ట్ర గ్రంథాలయ సంఘ అధ్యక్షులుగా ఉన్నారు. వయోజన విద్యాశాఖ డైరెక్టర్‌గా కూడా కొంతకాలం పనిచేసిన గాడిచర్ల గ్రంథాలయ పితామహుడిగా ఆంధ్రతిలక్‌గా పేరొందారు. 1928లో నంద్యాల్లో జరిగిన ఆంధ్ర మహాసభలో 'దత్తమండలానికి' రాయలసీమ అని పేరు పెట్టింది సర్వోత్తమరావుగారే. ఆంధ్ర మహాసభ కార్యకలాపాల్లో చురుకుగా పాల్గొన్న బూర్గుల శ్రీకృష్ణదేవరాయాంధ్ర బాషా నిలయానికి అధ్యక్షులుగా, కార్యదర్శిగా చేసారు. హైదరాబాద్ స్టేట్ కాంగ్రెసును ఏర్పర్చడమే కాక 1952 మార్చి 6న హైదరాబాద్‌కు మొట్టమొదటి ముఖ్యమంత్రిగా కూడా సేవలందించారు. అంతేకాదు యు.పి. కేరళ రాష్ట్రాల గవర్నర్‌గా చేసారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి డాక్టరాఫ్‌లా పట్టాను, ఆంధ్రా విశ్వవిద్యాలయం నుండి డాక్టరాఫ్ లిటరేచర్ పట్టాను పొందారు. రాయలసీమ ప్రాంతంలో జన్మించి దేశవ్యాప్త గుర్తింపు పొంది వయోజన విద్య, గ్రంథాలయోద్యమాలలో చివరిదాకా అవిరామకృషి చేసిన కర్మయోగి గాడిచర్ల వారైతే, తెలంగాణాలోని మారుమూల గ్రామంలో జన్మించి స్వయంకృషితో అంచెలంచెలుగా ఎదిగి దేశంలోనే మొదటి భూ సంస్కరణలు మొదలుకుని జాగీర్దారి వ్యవస్థను రద్దుచేయడం తెలుగు భాషని ప్రోత్సహించడం వంటివి చేసి, సాంఘిక, రాజకీయ, సాహిత్య రంగాలలో తనదయిన ముద్రవేసిన ధర్మయోగి బూర్గుల. సంస్కరణోద్యమాలు, భాషాభివృద్ధి, విద్య, గ్రంథాలయోద్యమం మొదలగు అంశాల్లో ఇరువురి కృషీ ఎన్నదగినదే. జీవితంలోని చివరిక్షణం వరకూ ప్రజల కోసమే జీవించిన ఈ ఇరువురు మాన్యుల స్ఫూర్తిని నేటి తరాలు గ్రహించడం చాలా అవసరం. ప్రమాదకరమైన నిర్లిప్తత రాజ్యమేలుతున్న వర్తమాన వ్యవస్థలో యువతకి దిశానిర్దేశం చేయడానికి ఉపకరించే ఇద్దరి గురించి ఇలా ప్రస్తావించుకోవడం ముదావహం.

# 6. మానవీయ మూర్తుల యాదిలో...
# మాలవ్యా - రాజాజి

**(డిసెంబర్ 25 పండిత మదన మోహన మాలవ్యా జయంతి రాజాజీ వర్ధంతిని పురస్కరించుకుని నా ప్రసంగ వ్యాసం)**

భారతీయ సాంస్కృతిక మూలాలు మానవతా ప్రధానమైనవి. ఇక్కడి తత్వశాస్త్ర దార్శనికతనూ, చింతనాత్మక ఆధ్యాత్మికతనూ మొత్తంగా ఒకే గాటికి కట్టిపడేయడానికి వీల్లేదు. అభిప్రాయ భేదాలు ఎన్నున్నా అందరి మేలు కోరి పనిచేయడమే మానవాళి అంతిమ సిద్ధాంతం కావాలి. ఆ దృష్ట్యా స్వాతంత్ర్యోద్యమ కాలంనాటి యిద్దరు నాయకులను ఇక్కడ స్మరించుకుంటున్నాం. అందులో మొదటాయిన పండిత మదన మోహన మాలవ్యా, రెండోది చక్రవర్తుల రాజగోపాలాచారి.

ఇరువురూ ఉద్యమకారులు. స్వాతంత్రోద్యమ ధీరులు. ఉత్తర, దక్షిణ స్వరాలు. విద్యార్థి దశనుండీ యిద్దరిపై వ్యవస్థ ప్రభావం మెండు. అందుకే ఎన్ని స్రవంతుల్లో ప్రవహించినా జనం కోసమే జీవించారు. లోక కళ్యాణం గురించే తపించారు. వారి వారి విశ్వాసాల్నీ, మార్గాల్నీ ఈరోజు గుడ్డిగా నెత్తిన పెట్టుకోనవసరం లేదుగానీ వాటిల్లోని ప్రజాహిత స్పృహను గుర్తించి కొనసాగించడానికి కొత్తకోణాల్ని వెలికితీయడానికీ ప్రయత్నించడం అవసరం.

ఇద్దరూ కాంగ్రెస్‌లో ముఖ్యపాత్ర పోషించారు. మాలవ్యా నాలుగుసార్లు కాంగ్రెస్ అధ్యక్షుడిగా ఎన్నికైతే, రాజాజి కాంగ్రెస్ నేతగా భారతీయ మొదటి గవర్నర్ జర్నల్‌గా మొదలుకుని వివిధ పదవులు చేపట్టారు. సహాయ నిరాకరణోద్యమం, రౌలత్ సత్యాగ్రహం, క్విట్ ఇండియా వంటి ఉద్యమాల్లో ఇద్దరి పాత్ర ఉన్నది. కాంగ్రెస్‌తో విబేధించి మాలవ్యా కాంగ్రెష్ నేషనలిస్ట్ పార్టీని స్థాపిస్తే, రాజాజి స్వతంత్ర పార్టీని స్థాపించారు. కాంగ్రెస్ తప్ప మరోగతి లేదనే వాదనల్ని ఖండిస్తూ కొత్త గాలులు వీచడానికి అవకాశం కల్పించిన ధిక్కార ధోరణి ఇరువురిలోనూ కనిపిస్తుంది.

ఇక పాత్రికేయ రంగంలో కూడా ఇద్దరూ ఇద్దరే. ప్రజల్ని నిత్యం చైతన్యవంతుల్ని చేసేందుకు కంకణం కట్టుకున్న ఇద్దరూ పత్రికా, సాహిత్య, సాంస్కృతిక రంగాల్లో తమదైన ముద్ర వేసారు. మాలవ్యా 'హిందుస్తాన్' హిందీ పత్రికకు సంపాదకుడిగా చేసారు. *'ది లీడర్'* పత్రికను స్థాపించి నడపడమే కాక, విద్యారంగంలో అవిరళ కృషి చేసారు. ప్రపంచంలోనే అరుదైన, ఎంతోమంది గొప్ప వాళ్ళను తీర్చిదిద్దిన 'బనారస్ హిందూ విశ్వవిద్యాలయాన్ని' ఒంటిచేత్తో నడిపిన ధీశాలి. విద్య పరాయీకరణకు సంబంధించి

దేశంలోని ఆలోచనాపరుల్ని హెచ్చరించినవాడు. తన ప్రసంగాలతో మేధావుల్ని సైతం ఆకట్టుకోగల కార్యవాది భారతీయ ప్రసిద్ధ నినాదమయిన "సత్యమేవ జయతే" సూక్తిని 1918లో ఢిల్లీలో జరిగిన జాతీయ కాంగ్రెస్ సభల్లో మాలవ్యానే 'మండూకోపనిషత్తు' నుండి ఉదహరించారని చెబుతారు. అలాగే సంస్కృతికీ – పర్యావరణానికీ దగ్గరి సంబంధాన్ని గ్రహించి నదుల పరిరక్షణకు నాంది పలికి ఈరోజు వెర్రితలలు వేస్తున్న ప్రసిద్ధ హరిద్వార్‌లోని గంగాహారతి సంప్రదాయాన్ని మానవీయ దృష్టితో మాలవ్యాగారే మొదలుపెట్టారట. స్వాతంత్ర్యోద్యమాన్ని నిర్దేశించిన చౌరిచౌరా ఘటనలో సుమారు 150 మంది తరఫున వాదించి కాపాడిన కార్యశూరుడు మాలవ్యా.

రాజాజీ సంగతి సరేసరి. దళితుల దేవాలయ ప్రవేశం, వైకం సత్యాగ్రహం మొదలుకుని ఎన్నో ఉద్యమాల్లో ఆయన ప్రభావం ఉంది. ఆంగ్ల, తమిళ సాహిత్యాల్లో అపారమైన పాండిత్యం గలవాడు. రామాయణ భారత ఉపనిషత్తులు మొదలుకుని, సోక్రటీస్ రచనల దాకా ఎన్నో గ్రంథాల్ని తమిళీకరించారు. కొన్నింటిని ఆంగ్లీకరించారు. హిందీని జాతీయ భాషగా దేశంమీద రుద్దినపుడు పెరియార్, అన్నాదురైల్తో కల్సి హిందీ వ్యతిరేకోద్యమాన్ని నిర్మించారు. భారతీయ విద్యాభవన్ స్థాపకుల్లో ఒకరు. 30 సం॥రాలపాటు మద్య నిషేధాన్ని అమలుచేసిన దేశంలోనే మొట్టమొదటి తిరుగులేని నేత. 'కల్కి' పత్రికలో ఎన్నో రచనలు చేయడమే కాక 'స్వరాజ్య' పత్రికను స్థాపించి నడిపారు. కమ్యూనిస్టుగా, రాయిస్టుగా, హ్యూమనిస్టు రాడికల్‌గా ఎంతో అనుభవం గల ఎమ్మెన్‌రాయ్ ప్రధాన అనుచరుడు ఫిలిప్‌స్ప్రాట్ 'స్వరాజ్య'కి సంపాదకుడిగా ఉండేవాడు. రాజాజీ గూర్చి గాంధీ "*నా అంతరాత్మని అదుపులో ఉంచేవా*"డనే అరుదైన వ్యాఖ్య చేసారు. మతాన్నీ, సంస్కృతినీ తమదైన శైలిలో అర్థం చేసుకొన్న రాజాజీ '*హిందూయిజం : డాక్టరయిన్ వే ఆఫ్ లైఫ్*' అనే గ్రంథం రాసారు. అణ్వాయుధాలు, యుద్ధాలకి వ్యతిరేకంగా ప్రచారోద్యమం చేసారు.

మతాన్ని, సంస్కృతిని మేళవించి ప్రమాదకరమయిన అమానవీయ సూత్రీకరణలు చేబడుతున్న వర్తమాన సమాజ పాలకుల వైఖరికి విరుద్ధంగా లౌకిక దృష్టితో ప్రపంచాన్ని వీక్షించే మానవతా కోణాన్ని పెంపొందించుకోవడం భావి మానవవాద జగతికి ఎంతో ప్రగతిదాయకం. అందులో భాగంగా భారతీయ సాహిత్య సాంఘిక, సాంస్కృతిక వికాసానికి తమవంతు తోడ్పాటునిచ్చిన ఇరువురూ **భారతరత్నలే** కావడం ఆశ్చర్యకరమేమీ కాదు. నిజాయితీ, నిబద్ధతల విషయంలో వీరి స్ఫూర్తి నేటి యువతకి మార్గదర్శకం, సెలవు.

---

## మా వద్ద లభించు యితర రచనలు

1. ప్రజాస్వామ్య పతనం
2. అరాజకత్వం అంటే ఏంటి?
3. సాంఘిక తత్వం - వైప్లవ మార్గం
4. ఒక నాస్తికుడి నామా
5. ప్రజాస్వామ్య ప్రస్థానం
6. అస్తిత్వం - అరాజకత్వం
7. మద్యంపై యుద్ధం
8. మతానికి మరణశాసనం - మనిషికి పునరుజ్జీవనం
9. కరపత్రాల కథా కమామీషు
10. తత్వవిచారణ - తర్క వివేచన
11. కులానికో సవాలు
12. ప్రకృతి-శాస్త్రం-సమాజం
13. ధిక్కార స్వరాలు
14. హేతువాద దృక్పథం - విధానపర కర్తవ్యం
15. కలాలు - కరపత్రాలు
16. పార్టీరహిత ప్రజాస్వామ్యం సాధ్యమా?
17. శిధిలాక్షరం
18. విస్మృత స్వరాలు
19. సద్దమ్మ స్వరాలు
20. వ్యవస్థలు - వ్యసనాలు
21. ధీరోదాత్తులు
22. ప్రజా ఉద్యమాల ప్రాతిపదిక
23. మద్యపానమా? మానవత్వమా?
24. తరగతిగది తత్వశాస్త్రం
25. అభివ్యక్తి
26. మానవతకు భరోసా

### స్వేచ్ఛానువాదాలు

1. పురుషుడు-స్త్రీ (చలం ఏకైక ఆంగ్ల రచన మేన్ అండ్ ఉమెన్ 100 సం॥రాల తర్వాత తెలుగులో)
2. సంపూర్ణ ప్రజాస్వామ్యం దిశగా (లోక్‌నాయక్ జయప్రకాష్ నారాయణ్ వ్యాసం తెలుగులో)
3. శాస్త్రీయ - హేతువాద - సామ్యవాద వివేకానంద (డా॥ దత్తప్రసాద్ దభోల్కర్ పరిశోధనాత్మక వ్యాసం తెలుగులో)
4. సాలీడు - ఈగ (జర్మన్ విప్లవకారుడు విలియం లిబ్నిక్ పిల్లల కోసం రాసిన కథ తెలుగులో)
5. నంది మూపురం (విఖ్యాత చరిత్రకారుడు డి.డి. కోశాంభి పిల్లల కోసం రాసిన ఏకైక కథ తెలుగులో)
6. మన విద్యా సమస్య (గదర్ పార్టీ స్థాపకుడు లాలా హర్‌దయాళ్ గ్రంథానికి జాతీయ నాయకుడు లాలా లజపతిరాయి రాసిన ముందుమాట తెలుగులో)
7. ఎక్కడ మనసు నిర్భయంగా ఉంటుందో.. (విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ ప్రసిద్ధ కవితకి రాడికల్ హ్యూమనిస్ట్ భాస్కర్ సూర్ విశ్లేషణ తెలుగులో)
8. చారిత్రక మహోద్యమం - చంపారన్ సత్యాగ్రహం (ప్రసిద్ధ మార్క్సిస్టు చరిత్ర కారుడు ఇర్ఫాన్ హబీబ్ మొదలుకుని ఇతరుల చంపారన్ ఉద్యమ శతవార్షికోత్సవ వ్యాసావళి)
9. ప్రకృతి శాశ్వత ప్రగతి (పర్యావరణ పితామహుడు, చిప్కో ఉద్యమ సారధి సుందర్‌లాల్ బహుగుణ, విమలా బహు గుణల ఇంటర్వ్యూ)

### సాఫ్ట్‌కాపీలు

1. స్వేచ్ఛ-సాంస్కృతిక ఆవశ్యకత (యం.ఎన్.రాయ్ వ్యాసం కల్చరల్ రిక్విసిట్స్ ఆఫ్ ఫ్రీడం తెలుగులో)
2. జీవితానికి అర్థం ఏమిటి? (సోషలిస్టు యోధులు ఆచార్య నరేంద్ర దేవ్, డా॥ రాంమనోహర్ లోహియా వ్యాసాలు తెలుగులో)
3. పేదల కలలు (అహ్మద్ అబ్బాస్ మొదలుకుని ఇతరుల మతోన్మాత వ్యతిరేక ఉర్దూ అనువాద కథా సంకలనం తెలుగులో)